శ్రీ

# కోదండరామశతకము

మేడిశెట్టి నారాయణస్వామి

ప్రణీతము.

తెనాలి తాలూకా, చుండూరు

మొదటికూర్పు 1000 ప్రతులు.

గుంటూరు చంద్రికా ముద్రాక్షరశాలయందు

ముద్రితము.

1924.

శ్రీరస్తు.

శ్రీరామాయణసార సంగ్రహసహిత

# శ్రీ కోదండరామశతకము.

మేడిశెట్టి నారాయణస్వామి

ప్రణీతము.

తెనాలి తాలూకా, చుండూరు.

గుంటూరు చంద్రికా ముద్రాక్షర[illegible]

ముద్రితము.

1924

కాపీరైట్ రిజర్వుడ్] [వెల రు. 0-4-0

# శ్రీరామాయణసార సంగ్రహము.

## సీసమాలిక.

శ్రీమించు రవికుల । శేఖరుఁడై సత్య
సంధుఁడై జనములు । సన్నుతింప
నతివిక్రముండై ని । యతి యఱువదివేల
సంవత్సరములు లేక । చక్రముగను
వసుధను బాలించి । వర్ధిల్లి భువిలో వె
లయు దశరథమహా । రాజునకును
బేర్మిఁ జతుర్విధ । భేదంబులై యెవ్వఁ
డతి పరాక్రమముల । నలరి లోక
రక్షణకై రామ । లక్ష్మణ భరత శ
త్రుఘ్న నామంబుల । తోఁ జనించి
సౌమిత్రితోఁగూడి । శైశవంబున నిజ
ఘనవీర్యమునఁ దాట । కను వధించి
హుంకరించుచు సుబా । హుని నొక బాణంబు
ననుదురించి మారీచుఁ । డనెడివాని
జలధిలోఁ బడవేసి । చంపి విశ్వామిత్ర
మునియాగ మంతయు । ముగియఁజేసి
యనఘుఁడు జనకుండు । గనుచుండ శివునివి
ల్విఱిచి భూపుత్రిని । వేడుకలరఁ
బెండ్లాడి పిదపఁ బృ । థ్వీపతియగు కార్త
వీర్యార్జునుని గెల్చి । విఖ్యాతిఁగు

పరశురాముని బాహు ƒ బల మడంచియు నయో
ధ్యాపురి కేతెంచి ƒ దైవవిధిని
సకల మహీరాజ్య ƒ సంపదలను వీడి
తనతండ్రివాక్యముఁ ƒ దలఁగకుండ
తాలిమితోడ సీ ƒ తాలక్ష్మణులు వెంట
నడువఁగాఁజని విపి ƒ నంబులకును
దుర్నయుఁడగు విరా ƒ ధుని వధియించియు
రక్కసియైన శూ ƒ ర్పణఖఁబట్టి
ముకుసెవుల్ గోయించి ƒ మూర్ఖులౌ ఖరదూష
ణాది రాక్షసులను ƒ హతమొనర్చి
దోర్బలమునఁ గబం ƒ ధుని దెగటార్చి దు
ర్జయుఁడైన వాలిని ƒ సంహరించి
సూర్యకుమారుఁడౌ ƒ సుగ్రీవునకు వాని
పట్టంబుఁగట్టి ప్ర ƒ భావమెసఁగ
నినసుతు ననుమతం ƒ బునఁ జెఱలోనున్న
కమలాక్షి సీతను ƒ గాంచిరాఁగఁ
బవనపుత్రుని వేఁగఁ ƒ బంపించి జానకీ
క్షేమంబు లరసి సు ƒ శ్రీ చెలంగఁ
గోఁతులగుంపులు ƒ గూడి డెబ్బదిరెండు
వెల్లువలై వెను ƒ వెంటఁదగిలి .
కోలాహలములచేఁ ƒ గొండలు పెకలించి
జలనిధి బంధించి ƒ శౌర్యమునను
జెలఁగి లంకాపురి ƒ చేఱువలోనున్న
తగుసువేలాద్రిపై ƒ దండు విడిచి

రణరంగమునను రా * వణకుంభకర్ణ ప్ర
ముఖులను దునుమాడి * ముదముగదుర
లంకకు రాజుగా * రావణానుజుని త
మ్ముని విభీషణు నిల్పి * మూఁడులోక
ములఁజూడ మిథిలేశు * ముద్దులపట్టిని
నగ్నిఁ బ్రవేశింప * నాజ్ఞయొసఁగి
యెల్లభూతములకు * నుల్లంబులో విస్మ
యముదోఁప వైదేహి * నమరమరలఁ
గొని పరమానంద * మునను సాకేతపు
రంబున కేతెంచి * రంగుమించి
భూరిసౌభాగ్యవి * స్ఫూర్తి సిద్ధి చెలంగి
సువ్రతశీలుఁడై * స్ఫురితశక్తి
రాజ్యాభిషిక్తుఁడై * రమణతోడను సర్వ
సామ్రాజ్యవైభవ * సాంద్రుఁడగుచుఁ

గీ॥ బుడమిఁ బాలించి ధర్మముఁ * బొందుపఱచి
సుజనులకు మోక్షమార్గము * సొరిదిఁ దెల్పి
ప్రజలు నుతియింప సుగుణాభి * రాముఁ డనఁగ
వెలయు నారఘురాముని * వేడ్కఁ గొలుతు॥

కం॥ శ్రీరామా! భూమిజా
మారా! మాన్యాఖిలర్షి ♦ పుంజులవ్రాత్సం
చారా! మానితగుణగం
భీరా! మా కామినీస ♦ మీహితధామా॥



శ్రీ ర స్తు.

# శ్రీ కో ద ం డ రా మ శ త క ము.

తే॥గీ॥ శ్రీమనోరామ ! రఘురామ ! ♦ రామనామ !
కోమలాంబుదశ్యామ ! వై ♦ కుంఠధామ !
కామరూపాభిరామ ! రా ♦ క్షసవిరామ !
దండిచుండూరిధామ ! కో ♦ దండరామ ! ౧

తే॥ గీ॥ శ్రీరమారామ ! విబుధచ ♦ కోరసోమ !
చారుతరనామ ! జయసీమ ! ♦ సార్వభౌమ
ధీరదత్తప్రణామ ! సు ♦ ధీలలామ !
దండిచుండూరిధామ ! కో ♦ దండరామ ! ౨

తే॥ గీ॥ వాసుదేవ ! పరాత్పర ! ♦ వామనాఖ్య !
భాసమాన ! పరంధామ ! ♦ భాసురాఖ్య !
దాసపోష ! భవక్షయా ♦ ధారముఖ్య !
దండిచుండూరిధామ ! కో ♦ దండరామ ! 3

తే॥ గీ॥ శ్రుతివికాసిత ! బహుపుణ్య ♦ సుగుణవిభవ !
పతితపావన ! త్రైలోక్య ♦ పతివి ! నీవ
ఋతపరాయణ ! మునిజనా ♦ శ్రితుఁడ వీవ
దండిచుండూరిధామ ! కో ♦ దండరామ ! ౪

తే॥ గీ॥ సాధుహృత్కమలాసీన! జలధిశయన!
బోధమూర్తి! యనంత! సత్పురుషశరణ!
మాధవాచ్యుత జేగీయమానసదన!
దండి ... ... ౫

తే॥ గీ॥ పురహరార్చిత! హితచతుర్భుజవిశేష!
గురుగుణాకర! నిత్య! వైకుంఠవాస!
తెరువు లేదింక నీకంటె దివ్యపురుష!
దండి ... ... ౬

తే॥ గీ॥ దీనరక్షక! పరతరా! త్రిదశవినుత!
మానితాకార! పరిపూర్ణ మహిమమిళిత!
మానసోద్యానమహిత! సమ్మాన్యచరిత!
దండి ... ... ౭

తే॥ గీ॥ కంజహితవంశసంభవ! కలుషభంగ!
మంజులాద్వైతనిర్మల మతి చెలంగ
నంజలి ఘటించి మ్రొక్కెద నతిశుభాంగ!
దండి ... ... ౮

తే॥ గీ॥ పరమపురుష! నిరీశ్వర! భవ్యహృదయ!
నిరుపమానంబు! నీరూప మరసి తెలియ
పరతరాత్మ! సుహృజ్జన భాగధేయ!
దండి ... ... ౯

తే॥ గీ॥ భువనమోహనవేష! సర్వేశ! ♦ పూజ్యపోష!
భవవినిశ్శోష! వీతదు ♦ ర్వారదోష!
దివిజసన్నుతపరితోష! ♦ దివ్యభాష!
దాండి ... ... ౧౦

తే॥ గీ॥ నిర్విశేష! నిరంజన! ♦ నిఖిలజనన!
మర్త్యాధిమహాబ్ధిపవన! సం ♦ తోషసదన!
సర్వలోకైకశరణ! సం ♦ సారశమన!
దాండి ... ... ౧౧

తే॥ గీ॥ కమలదళనేత్ర! త్రిభువన ♦ ఘనపవిత్ర!
విమతఖరదూషణారణ్య ♦ వీతిహోత్ర!
సుమహితానందభరిత! వి ♦ శ్రుతచరిత్ర!
దాండి ... ... ౧౨

తే॥ గీ॥ విశ్వతోముఖ! విశ్వాది! ♦ విమలమోది!
విశ్వరూపివి నీవు దు ♦ ర్వ్యధవిభేది!
విశ్వసించితి నిను మది ♦ వేదవేది!
దాండి ... ... ౧౩

తే॥ గీ సుకుచిరాచారసువిచార! ♦ సూర్యకులజ!
పరమభాగవతార్చిత ♦ పదసరోజ!
ఖరకరసుతేజ! బుధజన ♦ కల్పభూజ!
దాండి ... ... ౧౪

తే॥ గీ॥ నిగమనిగదిత ! నిర్ద్వంద్వ ! • నిర్వికార !
విగళితాశేషమాయాప్ర • వృత్తవార !
సగుణనిర్గుణసాక్షివి • సత్యసార
దండి ... ... ౧౫

తే॥ గీ॥ చిదచిదాత్మ ప్రకార ! సం • సృతివిదూర !
సదమలార్థఫలాధార ! • సద్విచార !
హృదయమున నమ్మితిని నిన్ను • ముదముమీర
దండి ... ... ౧౬

తే॥ గీ॥ అద్వయానందమూర్తివి • హరి ! రమేశ !
సద్విమలశీల ధృతమషి • షావిశేష !
చిద్విలాసవిభాసిత ! • శ్రీనివాస !
దండి ... ... ౧౭

తే॥ గీ॥ నీరజోదరుఁడవు నీవు • నిర్గుణుఁడవు
ధీరుఁడవు మఱి యసురసం • హారకుఁడవు
దూరదర్శివి యసమాన • దోర్బలుఁడవు
దండి ... ... ౧౮

తే॥ గీ॥ అప్రమేయుఁడ వఖిలలో • కాశ్రయుఁడవు
స్వప్రకాశకుఁడవు యశ • శ్శోభితుఁడవు
విప్రహితుఁడవు సమశాంత • వీక్షణుఁడవు
దండి ... ... ౧౯

తే॥ గీ॥ భానుకులసంభవుఁడవు సం • భావితుఁడవు
జ్ఞానగోచరుఁడవు శుద్ధ • సాత్వికుఁడవు
మానుగా సచ్చిదానంద • మయుఁడ వీవు
దండి … … ౨౦

తే॥ గీ॥ దశరథాత్మజుఁడవు పరం • ధాముఁడవును
నిశితశార్ఙ్గధరుండవు • నిర్భయుఁడవు
శశిదినేశ విశాలలో • చనుఁడ వీవు
దండి … … ౨౧

తే॥ గీ॥ కమలనాభుఁడ వీవు ని • ష్కర్ముఁడవును
ప్రముదితాత్ముఁడ వాద్యంత • రహితుఁడవును
సుమతిజనకాండశిక్షాను • కూలుఁడవును
దండి … … ౨౨

తే॥ గీ॥ చెలువుమీఱ తడివిజయుల • క్ష్మావిభుఁడవు
సలలితాత్మతపోధన • సత్తముఁడవు
ప్రళయసుస్థిరుఁడవు సత్య • వాక్పరుఁడవు
దండి … … ౨౩

తే॥ గీ॥ పరమవిజ్ఞానసంతోష • భరితుఁడవును
మహితపరుండవు దేదీప్య • మానుఁడవును
దురితదూరుఁడ వీ వతి • దుర్లభుఁడవు
దండి … … ౨౪

తే॥ గీ॥ అమలమతిచే భవత్పదా * ద్వయయుగములఁ
గ్రమముగా ధ్యాన మొనరింపఁ * గలుగు విమల
సుమహితాద్వైతనిర్వాణ * సుఖము మిగుల
దండి ... ... 3౫

తే॥ గీ॥ మఱచిపోకు మగణ్య! స * మాన్యపుణ్య
చరణపంకజ! మునియోగి * జనశరణ్య!
కరుణఁ జూడుము నన్ను స * ద్గుణవరేణ్య!
దండి ... ... 3౬

తే॥ గీ॥ చెలఁగు నినుఁ దనువాఙ్మనం * బులఁ దలంప
నలిమి వేయవె దుర్దశల్ ? * నుతనిలింప!
జలరుహాక్ష! నమోనమ * సర్వరూప!
దండి ... ... 3౭

తే॥ గీ॥ వాగగోచర! సకలవి * రాగహృదయ!
భోగిరాట్ఛాయి! యకలంక * మూర్తి! సదయ!
జాగు చేయక దయఁజూడు * జగదమేయ!
దండి ... ... 3౮

తే॥ గీ॥ శ్వసనములు గెల్చి పరిహృత * సంగివగుచు
నెసఁగు సర్వేంద్రియార్థని * వృత్తిఁ గొనుచుఁ
బొసఁగు నినుఁగాంచి సుజనుఁడు * బొంది మఱచు
దండి ... ... 3౯

తే॥ గీ॥ పరమపావనులైన నీ * భక్తవరుల
చరణయుగళరజమ్ము న * త్వరము మిగుల
శిరమునను దాల్చువాఁడను * చెలిమి దగుల
దండి ... ... ౪౦

తే॥ గీ॥ అనఘగమ్యుఁడవైన ని * న్నరయలేని
జనులతాపము లెడఁబాప * జనన మూని
మునిముఖాదుల వెలయవే * భూమిజాని
దండి ... ... ౪౧

తే॥ గీ॥ అరయ నిర్హేతుకదయాబ్ధి * వైననీదు
గురుతరాకృతి కింతేని * గొఱత లేదు
హరికులాధిప ! కుమతుల * కందరాదు
దండి ... ... ౪౨

తే॥ గీ॥ సుమహితాత్ములు మీపాద * కమలయుగళ
మమర భజియించి తమమాన * సముల మిగుల
విమలవిజ్ఞాన మొందరే * విరతి వఱల
దండి ... ... ౪౩

తే॥ గీ॥ ఎంచ ధాతవు పుడమి సృ * ష్టించుటకును ;
గాంచ హరివీవు పృథ్విఁ బా * లించుటకును ;
మించు శివుఁడవు భువి సంహ * రించుటకును ;
దండి ... ... ౪౪

తే॥ గీ॥ పన్నగాభరణాదులు * పరిభవించి
మున్ను నిన్నేకమనమున * సన్నుతించి
యున్నతత్వంబుఁ జెందరే * చెన్నమించి
దండి ... ... ౪౫

తే॥ గీ॥ నిక్కముగఁ జక్కనయ్యయుం * దొక్కగడియ
మక్కువేపాఱ నెవఁడేని * మ్రొక్క లెనయఁ
జిక్కులంబాసి ముక్తుఁడై * చెలఁగు సరయు
దండి ... ... ౪౬

తే॥ గీ॥ భూనభంబులు నిండె నీ * పూర్ణమహిమ
మాననీయ ! యశేషని * ర్మాణసుషమ !
జానకీరామ ! రవికుల * జలధిసోమ !
దండి ... ... ౪౭

తే॥ గీ॥ చూడ నీకు సమానుఁడౌ * వాఁడు ధరను ?
లేఁడు లేఁడని ఢంకాల * తోడ నేను
ప్రౌఢగజ మెక్కి చాటుదు * ప్రచురముగను
దండి ... ... ౪౮

తే॥ గీ॥ కరము భీష్మాంబరీషరు * క్మాంగదాది
పరమభాగవతులు నీదు * భజన నాది
వరనిరామయు లైరి ని * ర్వాణవేది
దండి ... ... ౪౯

తే॥ గీ॥ ఇరువుగాఁ జంద్రికళలకు నిందుమణులు
కఱఁగి జాఱినగతి నిన్నుఁ గాంచి జనులు
పరవశత్వము నొందరే మఱచియొడలు ?
దండి ... ... ౫౦

తే॥ గీ॥ చక్కెరయు వెన్న జున్ను పాల్మెక్కి మెక్కి
నిక్కి నీదిక్కు తక్కి మత్తెక్కి యెక్కి
చొక్కు జీవులు నీమాయఁ జిక్కి రొక్కొ ?
దండి ... ... ౫౧

తే॥ గీ॥ జాగిలంబులు సంకట స్థలములందు
రంగుదొలఁగు భయంకర రణములందు
భంగ మొందరు జనులు నీ భక్తియందు
దండి ... ... ౫౨

తే॥ గీ॥ కులుకుకలశముఁ బొడవైన గోపురంబుఁ
బొలుపుమీఱిన ప్రాకార మును ధ్వజంబు
నలరి వెలయును నీదుదే వాలయంబు
దండి ... ... ౫౩

తే॥ గీ॥ తలఁపఁగాఁ బశ్చిమోత్తర ద్వారములును
మలుపుజాతి తలంబ్రాల మంటపమును
మఱియుఁ బుష్పవనంబు వి మానములును
దండి ... ... ౫౪

తే॥ గీ॥ శ్రీరమాదేవి దేవ! నీ క్షింప సీత
వీరవైష్ణవు లీపరి వారజాత
మారమేశుఁడ వీవె స ర్వార్థభరిత!
దండి ... ... ౫౫

తే॥ గీ॥ తప్తకాంచనచేల! యు ద్యత్కపోల!
దీప్తకుండలమణిజాల! దివ్యలీల!
ఆప్తవరభక్తలోల! స త్యైకశీల!
దండి ... ... ౫౬

తే॥ గీ॥ శంఖచక్రగదాఖడ్గ శార్ఙ్గకములు
పొంక మొప్పఁ గిరీటాది భూషణములు
నంకితములౌను నీకు స ర్వాంకషములు
దండి ... ... ౫౭

తే॥ గీ॥ ప్రముదితాత్ముఁడ వగునీ ప్ర భావ మెన్న
సమధిక! బ్రహ్మకైన న శక్య మన్న!
విమలమగు తుంగభద్రతీ రముననున్న
దండి ... ... ౫౮

తే॥ గీ॥ వరధనుర్బాణవిధ్వస్త వైరినికర!
విరతనిస్సారసంసార విపులతిమిర!
భరితకరుణాసముద్ర! స ద్భక్తసుకర!
దండి ... ... ౫౯

తే॥ గీ॥ అనుజలక్ష్మణుఁ డాత్మీయ ధనువు దాల్చి
వినయభయభక్తు లమర మీ వెంట నిల్చి
తనరుచుండఁడె కింకర త్వమునఁ గొల్చి
దండి ... ... ౬౦

తే॥ గీ॥ భరతశత్రుఘ్ను లిరుగడ భ్రాతృవరులు
పరిఢవించియు గొడుగులు పట్టి వఱలు
తెరువునందుండు నినుఁగాంచు టరుదు నరులు
దండి ... ... ౬౧

తే॥ గీ॥ జనసరహితుఁడవై నీవు జగము నేల
ఘనపరాక్రమవహ్నిలో ఖలులు గూలఁ
దనరుచుందువు రామావ తారలీల,
దండి ... ... ౬౨

తే॥ గీ॥ సోమకుం డంబుజాసను శ్రుతుల నొడిచి
యామహాబ్ధిని డాచన య్యవది గలంచి
సామి! తెచ్చితి మత్స్యవే షమునుదాల్చి
దండి ... ... ౬౩

తే॥ గీ॥ అధిప! కూర్మంబవై మంద రాద్రి నెత్తి
సుధను బృందారకుల కిచ్చి ప్రథితవృత్తి
నిధన మొనరించితివి దైత్య విధము మొత్తి
దండి ... ... ౬౪

తే॥ గీ॥ వాటముగ వరాహంబవై | వార్ధిఁగప్పి
మీటి కోఱ ధరిత్రిజం | జాట ముడిపి
మాటికిని ధర్మ ములరింతు | ధాటిసొప్పి
దండి ... ... ౬౫

తే॥ గీ॥ శ్రితతంబగు నరమృగా | కృతిని దాల్చి
ఖ్యాతిమీఱ హిరణ్యాక | స్యపుని జీల్చి
ప్రీతితో వానిసుతునకుఁ | బ్రియ మొనర్చి
దండి ... ... ౬౬

తే॥ గీ॥ అల బలీంద్రుని బాతాళ | మంటఁద్రోసి
యిల సురేంద్రుని రాజుగా | నేలఁజేసి
యలరు వటుఁడవు వామనా | ఖ్యను ధరించి
దండి ... ... ౬౭

తే॥ గీ॥ సరకుసేయక మును రాజ | శత్రువరులఁ
బరశురాముఁడవై నీవు | పట్టి ఖలులఁ
జెఱిమి ముయ్యేడుమాఱులు | నఱికి తవల
దండి ... ... ౬౮

తే॥ గీ॥ తవిలి తమ్ముఁడు వెంటరా | దాశినెనసి
శివునివిల్లును దునుమాడి | సీతఁ గలిసి
భువన ములరించితివి పూర్ణ | భూతిమెఱసి
దండి ... ... ౬౯

తే॥ గీ॥ ద్యోతనంబగు మీపాద ధూళిఁజేర్చి
గౌతమునిభార్య చేసిన కలుష మార్చి
ఖ్యాతి నాతిగఁజేయవే, రంగుగూర్చి !
దండి ... ... ౭౦

తే॥ గీ॥ రాజితాశ్రితభక్తసం రక్షణార్థ !
పూజితాఖిలబుధలోక ! పుణ్యతీర్థ !
యాజకాయుస్సు నేలవే ! యతిసమర్థ !
దండి ... ... ౭౧

తే॥ గీ॥ మతవిలక్షిత ! నిన్నెట్లు మఱచిపోదు ?
క్షితిని శబరి యొసంగునం గిలిఫలాదు
లతిశయార్థిని భుజియించి తంచు విందు
దండి ... ... ౭౨

తే॥ గీ॥ తాటకిని ద్రుంచితివి నీవు పాటవమున
మీటితివి శివి నుడతమే నోటఁగరుణ
సాటిలేరయ్య హరి ! నీకు జలజచరణ !
దండి ... ... ౭౩

తే॥ గీ॥ శేషవాహన ! వినయసం భాషణునకు,
శోషితాత్మజభార్యాధ నీషణునకు,
రోషపడ కైక్యమీవే వి భీషణునకు
దండి ... ... ౭౪

తే॥ గీ॥ వరపరాక్రమశాలివై వనధిఁగట్టి
పరఁగ దురమున నసురుల భంగపెట్టి
గురుశరావళి రావణుఁ గూల్చినట్టి
దండి ... ... ౭౫

తే॥ గీ॥ రోహిణీదేవి సుతుఁడవై రూఢిమెఱయ
నాహవంబున శత్రుసందోహ మైనయ
బాహుబలమునఁ ద్రుంచవే పటిమ వెలయ
దండి ... ... ౭౬

తే॥ గీ॥ పూతనను జంపి కంసుని బూని త్రుంచి
యాతతాయిబకాదుల నని వధించి
ఖ్యాతినొందవె కేశవాఖ్యను వహించి ?
దండి ... ... ౭౭

తే॥ గీ॥ కొలువులోఁ గౌరవులు బాధ గొలిపి తన్ను
వలువ నూడ్చింపఁ బాంచాలి భక్తి నిన్నుఁ
దలఁప నీయవె కొంగుఁబోని వలువ మున్ను
దండి ... ... ౭౮

తే॥ గీ॥ కలుకుగుఱ్ఱముపై నెక్కి కుమతిజనులఁ
దళుకుఁగత్తిని చేపట్టి తవిలి ఖలులఁ
గలికివై త్రుంచవే నీవు ఘనత మిగుల
దండి ... ... ౭౯

తే॥ గీ॥ బలిమి నక్రిం బోకడు తన్నుఁ బట్టుకొనఁగ
నిలువనేరక భయమంది నినుఁ దలఁచఁగఁ
వెలఁగి జయమీవె? గజరాజు సిద్ధిఁ గొనఁగ
దండి ... ... ౮౦

తే॥ గీ॥ పుండరీకవిలోచన! బుద్ధరూప!
నిండుభక్తిని నినుఁగూర్చి నిర్వికల్ప!
దండములు వెట్టెదను నాదు తనివి దీర్ప
దండి ... ... ౮౧

తే॥ గీ॥ పావనంబులు భక్తసం భావనములు
జీవనంబులు భవలతా లావనములు
గావె జగదీశ! మీపాద సేవనములు
దండి ... ... ౮౨

తే॥ గీ॥ తోషణంబులు నిరతసం తుష్ట! సదయ!
భూషణంబులు చెవులకుఁ బుణ్యహృదయ!
భాషణంబులు హితవేష! పరమనిలయ!
దండి ... ... ౮౩

తే॥ గీ॥ భీషణంబగు మృతికి గం భీర! శూర!
తోషణంబగు మదికి ని ర్ధూతవీర!
దోషహారమగు నీపాద ధూళి ధీర!
దండి ... ... ౮౪

తే॥ గీ॥ మహితతేజోమయుఁడ వీవు మానవులకు
బహుళసంసారబంధముఁ బాపుకొఱకు
విహితగురుఁడవు, నన్నింక విడువఁబోకు
దండి ... ... ౮౫

తే॥ గీ॥ సారభూతపరిశాంత శాశ్వతపదంబుఁ
గోరితినిగాన నాకొసంగుము సుఖంబు
మీఱి నిన్నె భజించిన స్మృతి నిజంబు
దండి ... ... ౮౬

తే॥ గీ॥ అణుమహార్థస్వరూపివై యావరించి
తనరుపరమాత్మ వీవని నెనరుమించి
యనుసరించితి తుది విమోహమునడంచి
దండి ... ... ౮౭

తే॥ గీ॥ భూతమయుఁడవు నీను నేను బొందగోరి
చేతులొగ్గితి నిజభక్తి చేత శౌరి!
వీతరాగునిగాఁ జేయ వే మురారి!
దండి ... ... ౮౮

తే॥ గీ॥ దోసిలొగ్గిన సుజనుల డాసి నీవు
దోసములఁబాపి ధన్యులఁ జేసినావు
ధీసమంచిత! యింక నాకు దిక్కు నీవె.
దండి ... ... ౮౯

తే॥ గీ॥ మందుఁడను నేను కమనీయ। మానసుఁడవు
వందనము నీకుఁ ద్రిభువన। వందితుఁడవు
సందియము లేదు భక్తవ। త్సలుఁడ వీవు
దండి ... ... ౯౦

తే॥ గీ॥ నీవ తల్లివి, తండ్రివి। నీవ, దేవ!
నీవ సోదరుఁడవు, తోడు। నీడ వీవ;
నిన్నుఁదప్ప నితఃపరం। బెన్నఁబోవ
దండి ... ... ౯౧

తే॥ గీ॥ పరగఁ బంచేంద్రియములు నీ। పాలు చేసి
నిరత మితరార్థసౌఖ్యముల్। నేలఁద్రోసి
స్మరణఁజేయుచు నినుఁగాంతు। శక్తి మెఱసి
దండి ... ... ౯౨

తే॥ గీ॥ సంతసింపవె నినుఁగొల్తు। సర్వమూర్తి!
యంతరాత్ముఁడ వఖిలలో। కైకవర్తి!
పంతమెందుకు కలిత ది। గంతకీర్తి!
దండి ... ... ౯౩

తే॥ గీ॥ తొలుత దుర్విధిచేఁజేయు। దుష్కృతములఁ
దలఁపఁబోకుము బాలుర। తప్పిదములఁ
దొలఁగఁద్రోచియుఁ బ్రోవరే। యిలను ఘనులు?
దండి ... ... ౯౪

తే॥ గీ॥ కడచి భవవార్ధి దరిఁజేరు । కడఁకఁగాను,
విడువనేర సుమీ నిన్ను । విగతవృజిన!
తడయక కరావలంబనం । బిడవె కరుణ
దండి ... ... ౯౫

తే॥ గీ॥ కర్మపరిబద్ధచిత్తులఁ । గడియఁజేరి
దుర్మదాంధతమోభ్రాంతి । తోడ విఱాటి
నిర్మలంబు నెఱుంగ నో । ధర్మసూరి!
దండి ... ... ౯౬

తే॥ గీ॥ మెఱపుఁబోలు శరీరస । మ్మోళనమున
దురితసంస్మృతివార్ధిలో । దొరలుకతన
మఱచిపోయితి మును నిన్ను । మనములోన
దండి ... ... ౯౭

తే॥ గీ॥ సర్వసముఁడవు వేదాంత । సమ్మతుఁడవు
దుర్వినీతుఁడ నగునాకుఁ । దోడు నీవు
గర్వితాత్ముఁడ నేను ము । ష్కరుఁడఁగాపు
దండి ... ... ౯౮

తే॥ గీ॥ దారి నెండను బడి నీడఁ । గోరినట్లు
స్మారక మడంచి సాకెరుఁ । జాలిఁబెట్టు
నేరములు వాపుకొన నిన్నుఁ । జేరి తిట్లు
దండి ... ... ౯౯

తే॥ గీ॥ త్రివ్విసను భూమిఁ గనరాని ♦ దివ్యసమితిఁ
జువ్వో యంజనమును గాని ♦ చూచురీతి
నివ్వటిలు భక్తిచేఁ గంటి ♦ నిన్ను సుగతి !
దండి ... ... ౧౦౦

తే॥ గీ॥ దుష్టదుస్స్వహాకష్టముల్ ♦ దొలఁగునటుల
దృష్టి నిలుపుము నామీఁద ♦ దృఢతవొదల
శిష్టరక్షణప్రీతుఁడవు ♦ శ్రీవిలోల !
దండి ... ... ౧౦౧

తే॥ గీ॥ కంటిఁగంటి భవత్కటా ♦ క్షంబు నేఁడు
జంటఁబాయను మీపదా ♦ బ్జములతోడు
బంటునని యెంచి దోషముల్ ♦ గెంటఁ జూడు
దండి ... ... ౧౦౨

తే॥ గీ॥ సకలసాక్షిభూతుఁడవని ♦ సన్నుతించి
వికలదుర్భరకామాది ♦ వృత్తు లణఁచి
సుకవి నీమీఁదఁ గృతిఁజేయు ♦ సుఖము దలఁచి
దండి ... ... ౧౦౩

తే॥ గీ॥ సురుచిరంబగు గీతప్ర ♦ సూనములను
బరగఁ బూజించినాను, మీ ♦ పాదములను
సరగఁ గైకొను మాత్మ ను ♦ త్సాహముగను
దండి ... ... ౧౦౪

తే॥ గీ॥ అవ్యయామలమూర్తి! ని • న్ననుసరించి
శ్రావ్యమైన భవద్దివ్య • చరిత మెంచి
భవ్యసుఖమును గొంటిని • భక్తిఁగాంచి
దండి ... ... ౧౦౫

తే॥ గీ॥ గురుతరోజ్జ్వలజనకుల • గోత్రమందు
నరవిఁ గృష్ణయసుతుఁడనై • జనన మొంది
హరి నుతించితి నారాయ • ణాఖ్యఁ జెంది
దండి ... ... ౧౦౬

తే॥ గీ॥ ప్రోడిమిగ రాంజిగురుపదం • బులను ముట్టి
పాడిమెఱయ నీపైఁ గవి • త్వంబుఁ గట్టి
నాఁడ; విను నాగృహముపేరు • మేడిశెట్టి
దండి ... ... ౧౦౭

తే॥ గీ॥ నుడులఁ బొడమిన నెరసులఁ • దడవుమాని
యుడుగఁ జేసి యాకృతిఁ గొను • ముచితగతిని
గడుగుణాకర ! దయఁ బూని • కమలజాని !
దండి ... ... ౧౦౮

గర్భకమల విలసితవృత్తము.

శ్రీమహార ! శమదమ • సముచితభూమా
సమధిక ! సురముని • జననుతనామా !
భ్రమహార ! హితనిగు • పమగురుధామా !
సుమహిత ! దశరథ • సుత ! రఘురామా !

సంపూర్ణము.